Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org    Mobile App: Free Gurukul    email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul    Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ దక్షిణామూర్తి కల్పః

శ్రీ వనదుర్గాపంచశతీక్రమ

శ్రీ ప్రత్యంగిరాఋక్పారాయణక్రమ

శ్రీ కల్పసంవలితః

సంకలనకర్తా

శ్రీ విరజానందనాథదీక్షానామాంచితః

పోతుకూచి శ్రీరామమూర్తిః

ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.



[వెల : 15-00

# అవతారిక

ఓం నమో భగవతే దక్షిణామూర్తయే

జటామకుటినం దేవం ముద్రావ్యాఖ్యానమండితం।
త్రినేత్రం సుప్రసన్నాస్యం దక్షిణాస్య మహం భజే ॥

శ్రీకల్యాణాభిధం దేవం భారతీయతిశేఖరం ।
ఆచార్యం దక్షిణాచారప్రవర్తక మహం భజే ॥

పరమేశ్వరతత్త్వము సగుణ, నిర్గుణరూపముగా భావనీయము. ప్రత్యక్ చైతన్యాభిన్నమైన సచ్చిదానందమూర్తి, సత్త్వప్రధానమాయోపాధికుడు, బింబభూతుడు నగు పరమాత్మయే శ్రీదక్షిణామూర్తి యని శ్రీ శంకరభగవత్పాదులు దక్షిణామూర్తి మంత్రార్థ వివరణప్రసంగమున స్పష్టము చేసియున్నారు. ఆయన, సాక్షాచ్ఛివమూర్తి. శ్రీదక్షిణామూర్తి నిఖిలమంత్రద్రష్ట యగు ఋషియే గాక, మంత్రద్రష్టలయిన ఋషులందరకు ఆచార్యుడు, ఆరాధ్యుడు నగు జ్ఞానమూర్తి యని తెలియనగును. ఆ గురుమూర్తి చతుర్థాశ్రమనిష్ఠుడు, సర్వదేవమయుడు, ప్రభువు నయి విరాజిల్లుచుండును.

శ్రీదక్షిణామూర్తిమంత్రము మహామహిమసంపన్నము, సర్వార్థసాధకము నని ఉపాసకాగ్రేసరుల మతము. తన్మంత్ర జాపకుడు పాపవిముక్తుడయి శుద్ధాత్ముడగును; సర్వవిద్యాధి

పతియై జ్ఞానమును బడసి ముక్తిని పొందు నని యభిజ్ఞవచనము వలన తెలియుచున్నది.

మానసోల్లాసవ్యాఖ్యాకర్త శ్రీరామతీర్థయతి శ్రీగురుమూర్తి యగు దక్షిణామూర్తి స్వరూపము నీరీతిగా వివరించిరి.

"దక్షిణాభిముఖా మూర్తి ర్యస్య స దక్షిణామూర్తిః శివః । శ్రీస్తత్త్వబోధాత్మికా ఆవిష్కృతా శోభా అస్మిన్నస్తీతి శ్రీమాన్ । సచాసౌ దక్షిణామూర్తిశ్చేతి శ్రీదక్షిణామూర్తిః........గృణాతి తత్త్వజ్ఞాన ముపదిశతి శిష్యేభ్య ఇతి గురుః ।........అనేన స్వోపదేష్టృ గుర్వాత్మనా చాస్య ధ్యేయత్వం వివక్షితం దేవతారూపేణ గురురూపేణ చ ॥

కావున, శ్రీదక్షిణామూర్తి, స్వాత్మాభిన్నమైన శివమూర్తి, మంత్రోపదేష్ట యగు గురుమూర్తి రూపమున భావనీయుడు, ఉపాసనీయు డని గ్రహింపవలయును. ఈరీతిగ మూర్తిద్వయాత్మక మయిన శ్రీదక్షిణామూర్తి శ్రీవిద్యా సంప్రదాయప్రవర్తకులలో నన్యతము అని సంప్రదాయజ్ఞుల వచనము వలన తెలియుచున్నది.

శ్రీ దక్షిణామూర్తి, హయగ్రీవ, ఆనందభైరవులు శ్రీవిద్యాసంప్రదాయప్రవర్తకులుగ నెన్నబడుదురు. కాని, శ్రీ దక్షిణామూర్తి, హయగ్రీవుడు దక్షిణామార్గప్రవర్తకు లనియు,

ఆనందభైరవుడు వామమార్గప్రవర్తకు డనియు క్రిందివచనము వలన అవగత మగుచున్నది.

"శ్రీగురుర్దక్షిణామూర్తి ర్దక్షమార్గప్రవర్తకః ।
హయగ్రీవ స్తథా చైవం వామే చానందభైరవః ।
ఏతే హి మంత్రద్రష్టార స్తత్తన్మార్గప్రవర్తకాః ॥"

ఈ సంప్రదాయభేదము వలన శ్రీచక్రార్చనము నందును, తద్యంత్రలేఖన మందును వైవిధ్యము కలదని శ్రీహరిహరానంద సరస్వతి తన శ్రీవిద్యారత్నమం దీవిధముగా స్పష్టము చేసిరి.

"హయగ్రీవసంప్రదాయే శ్రీచక్రే వృత్తత్రయం నో ల్లిఖ్యతే। ఆనందభైరవసంప్రదాయే వృత్తత్రయేఽపి లిఖితే తత్రార్చనం న భవతి । శ్రీదక్షిణామూర్తి సంప్రదాయే వృత్తత్రయం లిఖ్యతే పూజ్యతే చ ॥"

అయినచో, ఎవరి సంప్రదాయము ఆశ్రయణీయము? అను శంక కలుగుట సహజము. స్వగురుక్రమప్రాప్తమైన సంప్రదాయమే ఆదరణీయమని జ్ఞానార్ణవమున స్పష్టము గావింపబడినది.

"సంప్రదాయా అనేకే చ జ్ఞాతవ్యాః స్వగురుక్రమాత్ ।"

శ్రీవిద్యాసంప్రదాయములో లోపాముద్ర, అగస్త్యుడు- వీరిరువురు హాదివిద్యాప్రవర్తకు లనియు, శ్రీదక్షిణామూర్తి కాదివిద్యాసంప్రదాయప్రవర్తకు డనియు తెలియుచున్నది. కామరాజ్విద్యయే కాదివిద్య. దీనినే 'మదనవిద్య' యని

గౌడపాదులు ప్రపంచించిరి. కాని, కాది హాది విద్యాగురు క్రమమున భేదము లేకపోవుటయే గాక

"దక్షిణామూర్తిశిష్యాణాం గురుక్రమ ఉదాహృతః"

యనుచు జ్ఞానార్ణవము సంప్రదాయద్వయ మందలి గురువు లందరును దక్షిణామూర్తిశిష్యులని స్పష్టము చేసినది. కాదివిద్యయందే గాక, హాదివిద్యయందుగూడ షోడశీవిద్య యున్నట్లు శ్రీవిద్యార్ణవతంత్రవచనము వలన తెలియుచున్నది. ఈ హాదివిద్య ఉత్సన్నమైన దనియు, కాదివిద్య అవిచ్ఛిన్నముగా వ్యవహారములో నున్నదనియు శ్రీ నటనానందనాథుడు కామకళావిలాస వ్యాఖ్యానమునందు వివరించెను.

> "శ్రీవిద్యారత్నాకరమనే సాధనద్వయ మస్తి కామరాజ సంతానం లోపాముద్రాసంతానం చేతి । కామరాజ సంతానక్రమస్తు సకలవిద్యానుసంధ్యవిచ్ఛిన్న ఇతి ప్రాచీన గురవోఽవ్యాచక్షతే । లోపాముద్రాసంతానక్రమస్తు విచ్ఛిన్నతయా ప్రవర్తతే ॥"

హయగ్రీవుడు అగస్త్యునకు విద్యాగురువు. కాదిహాది విద్యలు రెండును హయగ్రీవప్రోక్తము లయినను అగస్త్యుడు హాదివిద్యనే అవలంబించెను. హయగ్రీవప్రవర్తితమైన శ్రీవిద్యా సంప్రదాయమున ఉపాసన సప్తఖండాత్మకముగ నున్నదని శ్రీ లలితాసహస్రనామ భాష్యములో శ్రీ భాస్కరరాయలు వివరించిరి.

"తత్ర భవతో హయగ్రీవస్య దేశికేంద్రస్య ముఖాత్ బ్రహ్మాండపురాణీయ మంత్ర, న్యాస, పూజా, పురశ్చరణ, హోమ, రహస్య, స్తోత్రాఖ్యైః సప్తభిః ఖండైః రహస్య జాత మాకర్ణ్య పృచ్ఛతి ఇత్యాహ భగవాన్ సూతః।"

ఈ ఖండసప్తకము బ్రహ్మాండపురాణమునందు సమ్యక్ప్రపంచితము.

శ్రీషోడశాక్షరీవిద్యాద్రష్ట శ్రీదక్షిణామూర్తి యనియు, ఈ విద్య ఉచ్చార్యమాణ కాదనియు, ఇది అనేక పుణ్య సంప్రాప్య యనియు మంత్రమహోదధి, జ్ఞానార్ణవములు ఈ రీతిగా ప్రస్తుతించినవి.

"అనేకపుణ్యసంప్రాప్యా శ్రీవిద్యా షోడశాక్షరీ మునిః స్యాద్దక్షిణామూర్తిః పంక్తిశ్ఛంద స్సమీరితమ్ । దేవతా జగతా మాదిః శ్రీమత్త్రిపురసుందరీ ॥"

"ఉచ్చార్యమాణా యే మంత్రా స్తే సర్వే వాచికాః ప్రియే । ఉచ్చారరహితం వస్తు శ్రీవిద్యాషోడశాక్షరీ ॥ సవర్ణాఽపి వరారోహే వస్తు సాక్షాన్నిరక్షరం । భృంగో పభుక్తం శివే యోగ్యం యథా భవేత్ । తథా నిరక్షరం వస్తు హ్యక్షరైరపి సంయుతం । ఉదకే లిఖితం యద్వ న్మంత్రోచ్చార స్తథా భవేత్ । భోగమోక్షప్రదా విద్యా శ్రీవిద్యా షోడశాక్షరీ ॥"

అనగా, ఉచ్చార్యమాణమంత్రములు వాచికములు. కాని, షోడశాక్షరీమంత్రము ఉచ్చారరహితము. గురూపదిష్ట

మైన యీ మంత్రము అనూచ్చరిత మగును. అనూచ్చార్య మాణలక్షిత మగుటవలన, ఏతన్మంత్రద్రష్ట మౌనియై యుండును. కావున, శ్రీదక్షిణామూర్తి మౌనవ్యాఖ్యతో పరబ్రహ్మ తత్త్వము నభివ్యక్తము చేయుచుండునని దక్షిణామూర్తి స్తోత్రమున-

"మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానమ్"

అని శ్రీ శంకరభగవత్పాదులు దక్షిణామూర్తి తత్త్వమును వివరించిరి.

మౌనవ్యాఖ్యతో శిష్యసంశయచ్ఛేదన మొనర్చు శ్రీ గురుమూర్తి యొక్క ప్రసక్తి శ్రుతియందు కూడ కాన వచ్చును. బ్రహ్మసూత్రభాష్యములో ఉభయలింగాధికరణము (3-2-17) నందు శ్రీ శంకరభగవత్పాదు లీరీతిగా ప్రస్తు తించిరి.

"బాష్కలినా బాధ్వః పృష్టస్స న్నవచనేనైవ బ్రహ్మ ప్రోవాచేతి శ్రూయతే- 'సహోవాచాధీహి భగవో బ్రహ్మేతి। స తూష్ణీం బభూవ। తం హ ద్వితీయే తృతీయే వా వచన ఉవాచ। బ్రూమః ఖలు। త్వం తు న విజానాసి। ఉపశాంతో ఽయ మాత్మా' ఇతి ॥"

అనగా, బాష్కలుడు బ్రహ్మవిషయమై బాధ్వుని ముమ్మారు ప్రశ్నించెను. కాని, బాధ్వుడు మౌనము వహించెను. చివరకు 'ఇదివరకే చెప్పితిమి కదా! నీవు గ్రహించ లేదు, ఉపశాంతమైన దీయాత్మ' యని పలికెనని భావము.

'ఉపశాంత' మనగా 'నిరస్తద్వైత' మని అర్థము. కావున, తూష్ణీంభావము చేతనే బ్రహ్మతత్త్వము వ్యాఖ్యేయ మని గ్రహింప నగును. ఇట, శ్రీదక్షిణామూర్తిస్తోత్రమందలి "గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః" యను వచన మనుసంధేయ మని తెలియనగును. ఇంతేగాక, అనుచ్చరితమంత్రము శ్రేష్ఠ మని చెప్పిన జ్ఞానార్ణవ వచనము గూడ నిట భావనీయము. తన్మంత్రద్రష్ట యగు శ్రీగురు మూర్తి దక్షిణామూర్తి. పై భాష్యపంక్తులందు ప్రసక్తుడయిన బాధ్వుడు శ్రీదక్షిమూర్తి ప్రతిరూప మని గ్రహింపవలయును.

శ్రీదక్షిణామూర్తి మంత్రద్రష్ట, యుగనాథగురువు. ఆయన సాక్షాత్ శ్రీకామేశ్వరు డని తెలియనగును. శ్రీ లలితోపాఖ్యానమున ముప్పదిమూడవ యధ్యాయములో యుగనాథుల ప్రసక్తి కన్పట్టును.

"చత్వారో యుగనాథాస్తు లోకానా మభిగుప్తయే ।
సృష్టాః కామేశదేవేన తేషాం నామాని మచ్ఛృణు ॥
మిత్రేశోడ్డీశ షష్ఠీశ చర్యాఖ్యాః కుంభసంభవ ।"

నాలుగు యుగములకు వరుసగా మిత్రేశ, ఉడ్డీశ, షష్ఠీశ, చర్య లను మహనీయులు యుగనాథులైన గురువులుగ కీర్తింపబడిరి. ఈ యుగనాథులే గురునాథులై యోగశాస్త్రప్రవర్తకులు, మంత్రగురువులునై విరాజిల్లిరి. వీరిని సృష్టించిన శ్రీ కామే శ్వరుడు, మహాగురునాథుడైన శ్రీ దక్షిణామూర్తియే యని

గ్రహింపనగును. కావుననే శ్రీభగవత్పాదులు "తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే' యని యనుచు శ్రీ గురుమూర్తికి నమోవాకము పలికిరి.

ఈరీతిగ మహామహిమోపేతుడైన శ్రీగురుమూర్తి భగవద్గీతలలో వర్ణింపబడెను (2-54). శ్రీ శంకరభగవత్పాదులు తమ భాష్యములో నిట్లు వివరించిరి.

"సర్వత్రైవ హ్యధ్యాత్మశాస్త్రే కృతార్థలక్షణాని యాని, తాన్యేవ సాధనా న్యుపదిశ్యంతే। యత్నసాధ్యత్వాద్యాని యత్నసాధ్యాని సాధనాని లక్షణాని చ భవన్తి। "

ఈ భాష్యవచనములు ఈవిధముగా వివరింపబడినవి.

విద్యాస్థితయే ప్రాగ్యే సాధనభూతాః
ప్రయత్ననిష్పాద్యాః
లక్షణభూతాస్తు పునః స్వాభావత
స్తే స్థితాః స్థితప్రజ్ఞే ॥
జీవన్ముక్తి మితీమాం వద న్త్యవస్థాం
స్థితాత్మసంబోధాం।
బాధితభేద పతిభా మబాధితా
త్మావబోధసామర్థ్యామ్ ॥

విద్యావగతికి (జీవన్ముక్తస్థితికి) పూర్వము యత్నసాధ్యము లయిన సాధనములు స్థితప్రజ్ఞుడయిన జీవన్ముక్తునకు స్వాభావ భూతములయిన లక్షణము లగునని తాత్పర్యము.

స్థితప్రజ్ఞుడు, జీవన్ముక్తుడు, భగవద్భక్తుడు, గుణాతీతుడు, బ్రాహ్మణుడు, అతివర్ణాశ్రమి యని గురుమూర్తులు షడ్విధములుగా నుందురని జీవన్ముక్తివివేకము నందు శ్రీవిద్యారణ్యులీరీతిగా వివరించిరి.

"శ్రుతిస్మృతివాక్యాని జీవన్ముక్తిసద్భావే ప్రమాణాని। తాని చ కఠవల్ల్యాదిషు పఠన్తి విముక్తశ్చ విముచ్యతే', 'యథా సర్వే ప్రముచ్యన్తే....బ్రహ్మ సమశ్నుతే' ఇత్యేవమన్యత్రాప్యుదాహార్యమ్। స్మృతిషు జీవన్ముక్త, స్థితప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత, బ్రాహ్మణ, అతివర్ణాశ్రమ్యాది నామభి స్తత్ర తత్ర వ్యవహ్రియన్తే।వశిష్ఠరామ సంవాదే- 'నృణాం జ్ఞాననిష్ఠానా మిత్యారభ్య సత్కించి దవశిష్యత' ఇతి భగవద్గీతాసు ద్వితీయాధ్యాయే స్థితప్రజ్ఞః పఠ్యతే 'స్థితప్రజ్ఞస్య కా భాషే'తి, భగవద్భక్తః ద్వాదశాధ్యాయే భగవతా వర్ణితః 'అద్వేష్టా సర్వభూతానా' మిత్యాదినా। గుణాతీత శ్చతుర్దశాధ్యాయే। బ్రాహ్మణో వ్యాసాదిభి ర్వర్ణితః। అతివర్ణాశ్రమీ సూతసంహితాయాం ముక్తిఖండే పంచమాధ్యాయే। అతివర్ణాశ్రమీ సాక్షాద్గురూణాం గురురుచ్యతే। 'సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తః స ఏవ గురురుత్తమః' ఇత్యాదినా॥"

కావున, శ్రీ దక్షిణామూర్తి అతివర్ణాశ్రమి, యుగనాథగురు చతుష్టయమునకు సహితము ఆచార్యుడు, కామేశ్వరుడు, సదాశివాభిన్నుడు నని గ్రహింపవలసియున్నది.

'స గురుః స్యాదృషివాచకః'

యనుచు 'మంత్రద్రష్ట యగు ఋషియే గురుశబ్దవాచ్యుడు' అని ప్రపంచసారతంత్ర మందు గురుశబ్దనిర్వచనము చేయబడినది.

'దక్షిణాభిముఖమేవ దైవతమ్'

అనుచు, దక్షిణాముఖుడై యున్న సదాశివుడే దక్షిణామూర్తి యనియు, ఆ సంవిన్మూర్తి మౌనముద్రతో వటవృక్షమూల వాసియై ఆత్మతత్త్వము నభివ్యక్తము చేయుచుండు ననియు శ్రీ భగవత్పాదు లనిరి.

"వ్యాఖ్యానముద్రావిధినా మునీనాం
ప్రత్యంచ మర్థం ప్రతిపాదయన్తీ
సంవిన్మయీ కాచన వాసనా మే
వాసం విధత్తే వటమూలభాగే ॥"

అవిద్యానివర్తకమైన మేధస్సును, అఖండసాక్షాత్కార రూపమైన ప్రజ్ఞను అనుగ్రహించునట్టి యవతారమూర్తియే శ్రీ దక్షిణామూర్తి యని, దక్షిణామూర్తి మహామంత్రార్థ పరిశీలనము చేసినచో విదితమగును. కావున. శ్రీ దక్షిణా మూర్తిమహామంత్రము మహామహిమోపేతము. ఋషి, ఛ్ఛందోదైవత, హృదయాదిన్యాసజ్ఞానముతో జపానుష్ఠానము చేసినట్టి సాధకుడు సాక్షాద్గురుమూర్తి యగును. అందుచే నిట ఋషిచ్ఛందోదైవతవిచారణము చేయుట యావశ్యకము.

ప్రతి మంత్రము ఋషి చ్ఛందోదైవత సంవలితమై విరాజిల్లుచుండుట సంప్రదాయవేత్తలయిన సాధకవర్యు లెరుంగనిది కాదు. మంత్రానుష్ఠానసమయమున ఋషిచ్ఛందోదైవత జ్ఞానమావశ్యకమనియు, తాదృశజ్ఞానములేనిచో ప్రత్యవాయము కలుగు ననియు శ్రుతిస్మృతు లుద్ఘోషించుచున్నవి.

"యో హ వా అవిదితార్షేయచ్ఛందో దైవతబ్రాహ్మణేన మంత్రేణ యజతి యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి గర్తే వా పాత్యతే ప్రమీయతే పాపీయాన్ భవతి!" – ఆర్షేయ బ్రాహ్మణము.

"అవిదిత్వా ఋషిచ్ఛందోదైవతం యోగమేవ వా।
యోఽధ్యాపయే జ్జపేద్వాఽపి పాపీయాన్ భవతి॥"
–బృహద్దేవత 8-136

కావున, జపావసరమునందు ఋషిచ్ఛందోదైవతజ్ఞానముపాదేయ మని తెలియనగును. ఇంతే కాదు. ఏతాదృశ జ్ఞానముతో బాటు అంగన్యాస కరన్యాసాదివివేకము గూడ నావశ్యకము. శ్రీ శంకరభగవత్పాదులు ప్రపంచసారతంత్రమున ఆరవ పటలములో ఈ విషయమును సోపపత్తికముగ వివరించియున్నారు.

ఋషిర్గురుత్వా చ్ఛిరసైవ ధార్యః
ఛందోఽక్షరత్వా ద్రసనాగతం స్యాత్ ।
ధియాఽవగంతవ్యతయా సదైవ
హృది ప్రదిష్టా మనుదేవతా చ ॥

ఋషివర్ణాదికౌ ధాతూ స్తో గత్యా ప్రాపణేన చ ।
యాతాభ్యాం యత్స్వరూపం స గురుః స్యాదృషివాచకః ॥

ఇచ్ఛాదానార్థకౌ ధాతూ స్తశ్ఛదాద్య శ్ఛదాదికః ।
తయోరిచ్ఛాం దదాతీతి ఛందో మంత్రార్ణ వాచకమ్ ॥

ఆత్మనో దేవతాభావప్రదానా ద్దేవ తేతి చ ।
పదం సమ స్తతంత్రేషు విద్వద్భిః సముదీరితమ్ ॥

మంత్రద్రష్ట యగుటచేత ఆదిగురువు (పరమాత్మ) ఋషిశబ్దవాచ్యుడు. తాదృశ ఋషి జపానుష్ఠానసమయమున శిరోధార్యు డని గ్రహింపవలయును. అయినచో, జపావసరమున గృత్సమద, విశ్వామిత్రాది ఋషిస్మరణ మావశ్యకమా? యను శంకకు ఐతరేయశ్రుతి, 'ఆదిగురువగు పరమాత్మయే తత్తదృషిరూపమున మంత్రద్రష్టయై మంత్రసంప్రదాయ ప్రవర్తకు డగుచుండుననియు, కావున, ఋష్యాదిస్మరణ మావశ్యక మనియు' నీకింది ప్రతిపాదించుచున్నది.

"ఏత మేవ సన్తం శతర్చిన ఇత్యాచక్షతే । తస్మాద్ గృత్సమద ఇత్యాచక్షత.... తా వా ఏతా స్సర్వా ఋచః సర్వే వేదాః సర్వే ఘోషాః ఏకైవ వ్యాహృతిః ప్రాణ ఏవ ప్రాణ ఋచ ఇత్యేవ విద్యాత్ ।"

మంత్రద్రష్టలయిన గృత్సమద, విశ్వామిత్ర, వామదేవాది ఋషులు ప్రాణదేవతాబోధకులుగ తెలియవలయును. అనగా, జపానుష్ఠానసమయమున, మంత్రద్రష్టయగు ఋషిని ప్రాణ

దేవతగ (హిరణ్యగర్భఋషిగ) దర్శించవలయును. ఈవిచారణ వలన, ఆదిగురువు, మంత్రద్రష్టయు నగు పరమాత్మ సాక్షాద్ఋషివాచకు డని తెలియనగును. తాదృశ ఋషి, నిత్యప్రవణత్వాదిలక్షణవిలసితు డగుటవలన శిరోధార్యుడు. కావుననే, శిరోన్యాసము శాస్త్రవిహితమై యొప్పారుచున్నది. జపాద్యవసాన పర్యంతము శిరస్సునందు ఋషిన్యాస మనుసంధేయ మని శ్రీ శంకరులు 'ధార్య' శబ్దముచే స్పష్టము చేసిరి.

'సంఖ్యాదినియమితో ఽక్షరసంఘాతశ్ఛందః' అని ప్రయోగదీపికాకర్త ఛందఃశబ్దమును వివరించెను. నియత సంఖ్యతో నొప్పారునట్టి యక్షరసమూహము ఛందఃశబ్దవాచ్య మని భావము. ఆ ఛందస్సు అక్షరరూప మగుటవలన జప విధానములో రసనేంద్రియమునందు నిత్యప్రవృత్తి కలిగియుండును. అందువలన, ఇచట ఛందోన్యాసము విహిత మని తాత్పర్యము. 'రసనాగత' మనుటవలన రసన యందు ఛందోన్యాసము గూడ ఋషిన్యాసము వలె జపాద్యవసానపర్యంతము అనుసంధేయ మని భావింపవలసియున్నది.

మంత్రాధిష్ఠానదేవత బుద్ధిచే నవగంతవ్యుడు. అనగా ఆ దేవత 'అహం' అను భావముతో అనుసంధేయుడు. మంత్రాధిదేవత బుద్ధియందు సమువారూఢు డగుటవలన హృదయమున దేవతాన్యాసము విధింపబడినది. 'హృది ప్రదిష్టా' యనుటచేత జపాదినుండి జపాంతము వరకు పూర్వా

న్యాసముల వలె హృదయమున దేవతాన్యాసము చేయవలసి యున్నది.

అనుసంధాన విశేషమును ప్రతిపాదించుటకై శ్రీ శంకరులు, నిర్వచనపురస్సరముగా ఋషిచ్ఛందోదైవత శబ్దముల నీరీతిగ వివరించియున్నారు. 'ఋషి గతౌ, ఋషి ప్రాపణే' అను ధాతువుల నుండి ఋషిశబ్దము నిష్పన్నమైనది. గురువు పరమాత్మస్వరూపమును పొందును. తాదృశ గురుమూర్తి ఋషివాచకుడు. మంత్రయోగము వలన పరమాత్మత్వము, అజపాపరమాత్మప్రణవోక్త మార్గము వలన గురుత్వము-రెండును లభించును. పరమాత్మతావాప్తి శిష్యునకు గూడ కలుగునుగాని, శిష్యుడు సాధకుడు, గురువు సిద్ధుడను భేదమును గుర్తింపనగును. కావున, గురుత్వలక్షణరూపమున శిష్యునకు న్యాసము లేదు. మంత్రయోగము వలన పరమాత్మత్వావగతి కలిగినతర్వాత, సాధకుడయిన శిష్యుడు సిద్ధుడగును. అనంతరము గురుభావమును పొందును. గురుపరంపరలో దేవతకు, గురుశిష్యులకు ఐకాత్మ్యము చెప్పుదురు.

> "శిష్యో గురుశ్చ సః పరమాత్మైవ గురురూపేణ స్థితః ఋషివాచకః ।"

అని పద్మపాదులు ప్రపంచసారతంత్రవివరణములో వ్యాఖ్యానించిరి. మంత్రమును స్వీకరించు శిష్యుడు సాధకుడు; మంత్రద్రష్ట, మంత్రోపదేష్ట యగు గురువు సిద్ధుడు అని తెలియవగును. దేవతాగుర్వాత్మైక్యమును అనుసంధానము చేయుచు

శిరసునందు ఋషిన్యాసమును సాధింపనగును. హస్తమస్తక సంయోగముచేసి ఉపదేశ మొనర్చుటవలన గురుసన్నిధానము శిరస్సున విశేషముగా నుండును. అందువలన 'ఋషి ర్గురుత్వా చ్ఛిరస్యైవ ధార్యః' అని చెప్పిరి. అనగా గురు (ఋషి) న్యాసము శిరస్సునందు విహిత మని దీనివలన తెలియుచున్నది. శిష్యుని మూలాధారము నుండి ఆత్మతేజ ముద్గమించి ద్వాదశాంతమున (సహస్రారము) గల పరమాత్మ యగు గురువును చేరును. అటుపిమ్మట మంత్రము గూడ అచటకు జేరును. తర్వాత ఆ తేజస్సు తిరిగి స్వాయతనమగు మూలాధారమును జేరునని భావము.

ఛందశ్శబ్దము ఇచ్ఛా దానబోధక మయిన 'ఛద్, దాణ్' అను ధాతుద్వయము వలన నిష్పన్నమయినది. కాగా, కోరికల నొసగునది ఛందస్సు అని స్పష్టమగుచున్నది. కావున, సాధకున కభిమతము, సకలఫలామృతమయము, అక్షరాత్మకము నయిన ఛందస్సు రసనయందు అనుసంధేయ మని గ్రహింపనగును. మంత్రోపదేశము నొందిన శిష్యుడు ఏ గురురూపమును పొందునో, ఆ గురువు కోరికల నీడేర్చును గనుక ఛందశ్శబ్దవాచ్యు డగును. సాధకశిష్యుని ఆత్మతేజస్సు మూలాధారము నుండి యుదయించి ద్వాదశాంతస్థుడయిన పరమాత్మరూపగురువును జేరును. అచట, చైతన్యభాస్కర రూపమున వలన మంత్రమయమగు నమృతము లభించును.

మూలాధారమునగాని, హృదయమునగాని, ద్వాదశాంతమున గాని ప్రవహించునట్టి యీ యమృతము శరీరమందంతట వ్యాపించి సకలపాపక్షయహేతువు, సకలఫలప్రాపకము నగునని గ్రహింపవలయును. కావున, మంత్రోదయమునకు ముందే ఏతాదృశమైన అధికారభావన కలుగవలయు నని భావము.

ఆత్మయందు దేవతాభావమును సాధింపవలయును. అందుచే నిట దేవతాశబ్దనిర్వచన మీవిధముగా చేయబడినది. 'దీవ్యతే రూపం తేతి చ' అని దేవతాశబ్దనిర్వచనము. 'దివ్' ధాతువు క్రీడ, విజిగీష, వ్యవహార, ద్యుతి, స్తుతి, ప్రమోద, మద, స్వప్న, కాంతి, గత్యాదులను దెలియజేయును. 'తక్షి త్యక్షి తనుకరణే' యని తకారనిష్పత్తి చెప్పబడును. దేవతా శబ్దమందలి తకారమునకు 'కృత్స్నప్రదాన' మని యర్థము. కాగా, ప్రమోద, కాంతి గత్యాదులను సంపూర్ణముగ నిచ్చు వాడే 'దేవత' యని స్పష్ట మగుచున్నది. దేవతాస్వరూపము నావిర్భవించుటద్వారా ఆత్మావస్థాన (స్వరూపే అవస్థానం) మనుసంధేయము.

పై విచారణ వలన పిండీకృతార్థము నీవిధముగా తెలియనగును. ఋషిన్యాసము వలన శిష్యుని యాత్మతేజము మూలాధారమునుండి బయలుదేరి ద్వాదశాంతమున గల పరమాత్మ యను గురువును జేరును. ఛందోన్యాసము వలన నా తేజము మంత్రమయమగు మహాస్సుతో వాక్పథమున నవతరించును. దేవతాన్యాసము వలన దేవతాత్మకమగు

తేజస్సు శిష్యునిహృదయమునందు ఉద్భూతమై తదాత్మక మగును. మంత్రోదయానంతరమున గూడ ఈ ఋష్యాది న్యాసము లనుసంధేయములు, అనుష్ఠేయములు నని తెలియ వలయును. ఋష్యాదిజ్ఞానము, తత్తత్త్వానుస్మరణము ఆవశ్యక మని భగవత్పాదుల యాదేశము.

ప్రపంచసారతంత్రములో జపానుష్ఠానసమయమున కరణీయములగు షడంగన్యాసములు ఈరీతిగా వివరింపబడినవి.

హృదయశిరసోః శిఖాయాం
కవచాక్ష్యస్త్రేషు సహచతుర్థీషు ।
నత్యా హృత్యా చ వషడ్ హుం
వౌషట్ ఫట్ పదైః షడంగవిధిః ॥

హృదయం బుద్ధిగమ్యత్వాత్ ప్రణామః స్యా
న్నమః పదమ్ ।
క్రియతే హృదయేనాతో బుద్ధిగమ్యా నమస్క్రియా ॥

తుంగార్థం స్యాచ్ఛిరః స్వే స్వే విషయేఽహరణో ద్విరః ।
శిరోమంత్రేణ చోత్తుంగవిషయాహృతి రీరితా ॥

శిఖా తేజః సముద్దిష్టా వషడిత్యంగ ముచ్యతే ।
తత్తేజోఽస్య తనుః ప్రోక్తా శిఖామంత్రేణ మంత్రిణః ॥

కవగ్రహణ ఇత్యస్మా ద్ధాతోః కవచసంభవః ।
హుం తేజ స్తేజసా దేహో గృహ్యతే కవచం తతః ॥

నేత్రం దృష్టిః సముద్దిష్టా వౌషడ్దర్శన ముచ్యతే ।
దర్శనం దృశి యేన స్యా త్త త్తేజో నేత్రవాచకమ్ ॥
అసు త్రసాదికౌ ధాతూ స్తః క్షేపచలనార్థకౌ ।
తాభ్యా మనిష్ట మాక్షిప్య చాలయేత్ ఫట్పదాగ్నినా ॥

హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము అనునవి మంత్రమునకు షడంగములు. హృదయాది శబ్దముల చతుర్థీవిభక్త్యంతములకు క్రమముగా నమః, స్వాహా, వషట్, హుం, వౌషట్, ఫట్ అను పల్లవములను సంయోజనము చేసి షడంగన్యాసము చేయనగును.

హృదయ మనగా ' దేవతాహృదయ ' మనియే గ్రహింపవలయును. ఇది బుద్ధిగమ్యము. సాధకుడు ఆత్మ ప్రతిపత్తికై సర్వాత్మనా దేవతాహృదయమునకు నమస్కరింపవలయును. సాధకుడు హృదయమంత్రముచేత స్వహృదయ గమ్యమానుడగు దేవతకు, క్షేత్రజ్ఞభూతుడయిన ఆత్మకు నమస్కరింపనగును. దేవత పరమాత్మయే. ఆ పరమాత్మ హృచ్ఛబ్దగమ్యమానుడని గ్రహింపవలయును. హృచ్ఛబ్దము నకు 'హృదయస్థబుద్ధి' యని అర్థము. ఇట సాధకుని బుద్ధియే అభిప్రేతము. అవగతిమంత్రము ద్వారా దేవతయొక్క శబ్ద గమ్యత్వమును, అన్వయవ్యతిరేకముఖమున బుద్ధిగమ్యత్వమును సాధింపనగును. మంత్ర మవగతము కాగా, ఉపాదేయ మగుట చేత దేవతాభిముఖగతియే నమస్కార మని భావము. దేవతా త్మైక్యము చెప్పుటవలన దేవతను 'అహం' అను భావముతో

పొందనగును. కాని, ఇది బుద్ధిగమ్య మగుటంజేసి 'నేను దేవతకంటె అల్పుడను, నేను తద్రూపుడనే యగుచున్నా' నని సర్వమంత్రములందును, తదక్షరన్యాసాదులందును నమ శ్శబ్దమునకు అర్థద్వయము అవగంతవ్య మని తెలియనగును.

శిరశ్శబ్దముచేత దేవతాదేహము గ్రహింపబడును. ప్రధానాంగ మగుటంజేసి శిరస్సు సమస్తాంగముల కుపలక్షక మని తెలియవలయును. సౌందర్యాతిశయయోగము వలన శిరస్సు అన్యావయవములకంటె విశిష్టమయినది. ఏతాదృశ మయిన శిరస్సునందు ఆత్మీయమగు సర్వమును ఉపభోగ్యముగ సమర్పించుటకై ఇట స్వాహాకారము ప్రయుక్తము. ఆత్మీయ మగు నర్థజాత మంతయు నానావిధవిషయాత్మక మగుటవలన తదుపభోగమునకు మరి శ్రుత్యాదిభేద ముపపన్నము. విషయా హారణమే ఉపాహారణ మనబడును. 'స్వాః' అనగా 'స్వాహా' యని యర్థము. దేవతాదేహమునందు స్వీయమగు నర్థజాత మును సమర్పించుటయే ఇట విషయాహారణ మని గ్రహింప వలయును. హృదయమందు దేవతాతత్త్వ ముపాదేయమై ప్రతిపన్నమగుచున్నది. కావున, హేయోపేక్షననుసరించి శిరస్సున కుత్తుంగత్వము ప్రాప్త మగుచున్నది. అనాత్మకమగు నర్థజాతము స్థూల, సూక్ష్మాది భేదములతో ననేకవిధములుగా నుండుటవలన తత్తదుపాహారణమున గూడ భేదముండుట స్వాభావికము. విషయాహారణ మనబడు నుపాహారణమునకు 'ఫలతోవిలాపన' మని యర్థము.

దేవతయొక్క కేశ, కిరీటా ద్యుపాంగసముదాయము 'శిఖా' శబ్దముచేత చెప్పబడును. ప్రధానోపాంగ మయిన శిఖ ఇతరములయిన ఉపాంగముల కుపలక్షకము. శిఖ యనగా విగ్రహోద్గతమైన తేజస్సు. ఇచట 'వషట్కార' శబ్దము స్వదేహమునుగూడ ఉపభోగ్యముగ సమర్పించుటను తెలియ జేయును. స్వాహాకారమున ద్రవ్యము మాత్రమే సమర్పించ బడును. వషట్కారమున సమర్ప్యమాణమగు ద్రవ్యము మహస్సు యని తెలియవలయును. దేవతాత్మశక్తికి కలుగు స్వదేహతృప్తి, కామాద్యుపశమనము నమః శబ్దముచేత అభిహిత మగును. 'హుం' అనునది కవచశక్తిసాధన చేయు సాధకుని యొక్క బలవద్బాధకములను దగ్ధముచేయును. నత్యాదులందు సాక్షాత్తుగ ఆత్మాత్మీయసమర్పణము, పరోక్షముగ 'మదీ యోఽసౌ' - 'ఇతడు నావాడు' మన్నగు విశేషభావ సమర్పణము విహిత మని భావించవలయును 'హుం, ఫట్' ల యందు సమర్పణము పరోక్షముగ బాధకావసాన రూపము లోను సాక్షాత్తుగ దహనవిశేషోత్పత్తి రూపమున నుండును. కార్యకరణాత్మకశరీరము 'వషట్' శబ్దవాచ్యము. అనుష్ఠాత యొక్క స్వరూపభూత మయిన తేజస్సు ఇట శరీరముగా నధ్యస్తము చేయబడుచున్నది. సమర్పణదశాపేక్ష ననుసరించి తత్తేజమే శరీర మనియు నిర్దేశింపబడుచున్నది.

'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే'

అనగా, అధ్యారోపము, అపవాదములచేత తత్త్వము యొక్క

స్వరూపసిద్ధి కలుగు నని భావము. ఆరోపితమైనదాని ద్వారా అనారోపిత తత్త్వమును తెలిసికొనగలము.

శిఖ యనగా తేజస్సు. తేజస్సు చిదాత్మకము. ఆ జస్సునందు సర్వవిషయాహుతి చేయబడును. అప్పుడు దాని యందు మహాదీప్తి యుద్భవించును. 'వషట్' అని దేహ సమర్పణము చేసినప్పుడు దేహాదులు లేకున్నను 'అతస్మిం స్తద ధ్యాసః' అని శరీరము అధ్యస్తమై యుండును గాన, 'శరీరం వషట్' అని చెప్పబడినది. స్వరూపభూతమైన తేజస్సే శరీరము. కావున, 'శిఖాయై వషట్' అనునపుడు చిదచి ద్భేదాపేక్ష ననుసరించి నానాత్వము, తదన్యతాపేక్షయా అభేదము అని తెలియనగును. 'శిఖాయై వషట్'అనుదానిచేత ఆత్మయందు అనాత్మాధ్యాస చెప్పబడును.

అనాత్మయందు ఆత్మాధ్యాస 'కవచాయ హుం' అను దానిచే భావనీయము. 'కవ' ధాతువునకు గ్రహణ మని యర్థము. సర్వమును గ్రహించున దగుటచేత దేహమే కవచ మని తెలియవలసియున్నది. స్వదేహమును, ఆత్మీయమయిన సర్వమును దేవతకు సమర్పించుటయందే హుం, వౌషట్, ఫట్ పదములకు తాత్పర్య మని సంప్రదాయజ్ఞుల మతము. 'హుం' అను పదము చేత పరభీతికరము, అభిమతపరిగుప్తి ప్రధానమునైన తేజస్సు పరిలక్షిత మని గ్రహింపవలయును. "తేజసా చైతన్యేన దేహః పూర్వోక్తో గృహ్యతే వ్యాప్యతే యతస్తతః కవచ మిత్యుచ్యతే" అని పద్మపాదులు కవచ

శబ్దార్థమును వివరించిరి. తేజశ్శబ్దముచే నిట దేహమే గ్రహింపనగును.

ముక్తుడు, పరమాత్మ - వీరి విషయములో ఆరోప మనబడు అధ్యాస లేదు. జీవన్ముక్తుని విషయములో గూడ ఆత్మయందు ఆరోపము ప్రసక్తము కాదు. ఆత్మయందు అనాత్మాధ్యాస, అనాత్మయందు ఆత్మాధ్యాస బద్ధులవిషయ ముబోనే ప్రసక్తించును. వీరికి దేహాదులయందే అహమా ద్యభిమాన మున్నది.'కవచాయహుం'అనుదానిచేత దేహమున తేజస్సు వ్యాపించి యున్నదను భావము అనుసంధేయ మని గ్రహింపవలయును.

నేత్రమంత్రము చేత అధ్యాసనివర్తకజ్ఞానము చెప్ప బడును. నేత్ర మనగా దృష్టి. దేవతయొక్క దృగింద్రియమే నేత్ర మని భావింపనగును. స్వీయదేహనిమిత్తము ఉప భోగ్యము,రక్ష్యముగా సమర్పించుటకై వౌషట్ విధింపబడినది. వౌషట్ శబ్దము ప్రదానవాచకము. కాని సాధకుని దేహాది కమునకు ఆహ్లాదసంధాయకము. రవి- ఇందు- వహ్న్యాత్మక మయిన తేజస్సు మాత్రమే వౌషట్ శబ్దవాచ్య మని తెలియ వలయును. ఏ తేజస్సుచేత దేవతాదృగింద్రియమున సాధక బాధకదర్శనము కలుగునో, తత్తేజోవాచకము నేత్రమంత్ర మని స్పష్ట మగుచున్నది. యాథార్థికజ్ఞానము వస్తుమాత్ర విషయకము, శాబ్దజ్ఞానము యాథాత్మ్యవిషయకము. కావున, దీనిని దర్శన మనియు, తదాకారజ్ఞాన మనియు నందురు. ఇది

యధ్యాసనివర్తకము. 'నహి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే' యని బృహదారణ్యకశ్రుతి చెప్పుచున్నది. తాత్త్విక సమీక్షణము చేయునపుడు సూక్ష్మతత్త్వమైన చిద్రూపమే దర్శనవిషయ మగును. 'దృష్టేః దృష్టిః పరమాత్మా' యని పద్మపాదుల వచనము. పరమాత్మ సాక్షాద్దృష్టిరూప మని భావము.

ఉత్పన్నజ్ఞానము సంసారనివర్తక మని అస్త్రమంత్రము వలన అవగత మగును. 'అసు క్షేపణే, త్రస చలనే' అను ధాతువులనుండి అస్త్రశబ్దము నిష్పన్నమైనది.

"అస్యతి బాధకం స్వవిషయ ఆక్షిపతి త్రాసయతి చ తం స్వావస్థాత శ్చాలయతీ త్యస్త్రమ్"

అని ప్రయోగదీపికాకర్త అస్త్రశబ్దమును నిర్వచించెను. ఇచట స్వీయదేహనిమిత్తము రక్ష్యముగా సమర్పించుటకు 'ఫట్'అను పల్లవమును సంయోజింపవలయును. ఆక్షిప్తమైన యనిష్టమును ఫడగ్నితో దహింపచేయవలయును. స్వదేహము కొరకు సాధకుడు స్వశక్తియందు సమర్పించి స్వబాధకమగు సర్వమును అస్త్రమంత్రముతో దాహ మొనర్పనగును. చలన- ఆక్షేపములు అస్త్రము యొక్క స్వాభావిక వ్యాపారములు. తాపత్రయాస్పదమైన సంసారమే అనిష్ట మనియు, సకల సంసారదాహకమైన పరమాత్మతేజస్సే ఫడగ్ని యనియు

గ్రహింపనగును. ఈ తేజస్సు యొక్క ఆక్షేప- చలనరూప వ్యాపారమే అస్త్రమని తెలియవలయును. కావున, షడగ్నితో నాక్షిప్తము, ప్రచాలితము చేసి సంసారరూపమైన యనిష్ట మును దగ్ధ మొనర్పవలయును. ఈవిధముగా హృదయశిరో న్యాసములు అపవాదమును, శిఖాకవచన్యాసములు ఆరోప మును చెప్పును. అటు పిమ్మట నేత్రన్యాసము వలన అనాత్మ యందు ఆత్మాధ్యాస, అస్త్రమంత్రమువలన ఆత్మయందు అనాత్మాధ్యాస నిరస్తము లగును.

విద్యారణ్యమునికృత మయిన 'అనుభూతిప్రకాశ' యందుగూడ పై విషయము ఈరీతిగా వివరించబడెను.

"యత్స్వరూపం యాతి గురుః పరమాత్మైవ శిష్యోఽపి। గురురూపేణ స్థిత స్తస్య పరమాత్మనః స్వరూపం యాతీతి ఋషిన్యాసస్య పరమార్థః ॥

ధాత్వర్థానుగుణ్యేన పరమాత్మానం జ్ఞాతు మిచ్ఛాం దదాతీత్యర్థః ॥

హృది అయ మితి శ్రుత్యా హృదయం దేవతా పరమా త్మైవోచ్యతే ॥

ఋషిచ్ఛందో దైవతాని న్యసేన్మంత్రస్య మంత్రవిత్ । ఆత్మనో మూర్ధ్ని వదనే హృదయే చ యథాక్రమమ్ ॥

హృదయమంత్రేణానాత్మనో వివిచ్యాత్మప్రతిపత్తిపరో హృదయన్యాసః ॥

ఉత్తుంగే పరమాత్మని విషయస్య హృదయమంత్రేణ వివిక్తస్య విలాపనపర శ్శిరోన్యాసః ॥

ఇతి ద్వాభ్యాం శిరోహృదయమంత్రాభ్యా మన్యతరా ధ్యాసస్యాపవాదం కృత్వాఽధ్యారోపాయ శిఖామంత్రః అనాత్మన్యాత్మాధ్యాసపరః ॥

కవచమంత్రస్తు ఆత్మన్యనాత్మాధ్యాసపరః ॥

అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే ।
ఇతి న్యాయేన దేహాంత ఆరోపః ఖాదిభిరీరితః ॥

అథాపవాదో జగతః కథ్యతే బ్రహ్మబుద్ధయే ।
సాకల్యం పుత్రాదే ర్వైకల్యం చాత్మ నీక్ష్యతే ॥
అతస్మింస్తద్బుద్ధి రిత్యవోచామేతి భగవాన్ భాష్యకారః॥
నేత్రమంత్రోఽనాత్మన్యాత్మాధ్యాసనిరాకరణపరః ।
అస్త్రమంత్ర ఆత్మన్యనాత్మాధ్యాసం నిరాకరోతి ।
ఉత్పన్నబ్రహ్మాత్మైక్యజ్ఞానేన సంసారనివృత్తిః ॥

శైవ శాక్త షడంగన్యాసవిశేషము లలితోపాఖ్యానమున ఈవిధముగా ప్రపంచితమయినది.

"హృద్దేవీ చ శిరోదేవీ శిఖాదేవీ తథైవ చ ।
వర్మదేవీ నేత్రదేవీ శస్త్రదేవీ షడీరితా ॥

సర్వజ్ఞా నిత్యతృప్తి శ్చానాదిబోధా స్వతంత్రికా ।
తథా నిత్యమలుప్తా చానంతేత్యాదా క్రమాత్పఠేత్ ॥

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః ।
సర్వాత్మా చ షడంగేషు యోజనీయా స్తతః పరమ్ ॥"

ఉక్తం చ దేవీభాగవతే

"సర్వజ్ఞతా తృప్తి రనాదిబోధః
స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః ।
అనంతతా చేతి విభోర్విధిజ్ఞాః
షడాహురంగాని మహేశ్వరస్య ॥"

ఏవంవిధవివేకముతో హృదయాదిన్యాసములను చేసిన శిష్యుని ఆత్మతేజస్సు మూలాధారమునుండి యుద్గమించి, ఊర్ధ్వముఖముగా నధిరోహించి ద్వాదశాంతస్థుడు, పరమాత్మస్వరూపుడు నయిన గురుమూర్తిని జేరును. అనంతము వర్ణసంఘాత దేవతాభేదలక్షణమగు మంత్రమును గ్రహించి స్వాయతనమును జేరును. అప్పుడా తేజస్సు ముఖమునందు వర్ణాభివ్యక్తిని, హృద్దేశమున తద్వాచ్య దేవతాతత్త్వాభివ్యక్తిని పొందును. పేటికి ఐకాత్మ్యముండుటవలన, చిదచిద్వివేక

సమర్థమై, తత్తేజోంశల ద్వారా హృదయాద్యంగములను జేరును. హృదయ శిరోన్యాసానంతరము సాధకుడు కార్యము యొక్క అచిదంశను శిఖయందు, కారణము యొక్క అచిదంశను ఆత్మయందు సంహారము గావింపనగును. కవచమంత్రముతో విగ్రహాగ్రహణము చేయవలయును. నేత్రమంత్రముతో సర్వజ్ఞత్వమును సాధింపవలయును. అస్త్రమంత్రముతో అజ్ఞానాద్యనిష్టములను నాశ మొందించవలయును. ఈ విధముగా హృదయాదిన్యాసవివేకమును తెలియనగును. ఇంతటి మహత్త్వసంపన్నము, విహితము నగుటవలన, ఋషిచ్ఛందోదేవతా హృదయాది న్యాసరహితముగా మంత్రజపానుష్ఠానము నిషిద్ధ మని శ్రీభగవత్పాదుల యాదేశము.

హృదయాదిన్యాసమునకు పూర్వమే మంత్రముయొక్క బీజ, శక్తి, కీలకములను నిర్దేశింపవలసియున్నది. రామతాపిన్యుపనిషత్తులో ఏతన్న్యాసస్థానములు ఈరీతిగా వివరించబడినవి.

"బీజం శక్తిం న్యసే ద్దక్షవామయో స్తనయోరపి
కీలో మధ్యేఽవినాభావ్యః స్వవాంఛావినియోగవాన్
సర్వేషామపి మంత్రాణా మేష సాధారణక్రమః ॥"

బీజన్యాసము దక్షిణస్తనమున, శక్తిన్యాసము వామస్తనమునందు, కీలకన్యాసము తన్మధ్యభాగమందు చేయవలయును.

ఈ న్యాసత్రయము సర్వమంత్రములకు సాధారణమైన క్రమమని గ్రహించవలయునని భావము.

వేదావిరుద్ధము లయిన తంత్రభాగములే ఆదరణీయ ము:లు, ప్రామాణికములు. కావున, శ్రుతిసంమతములు, తంత్ర శాస్త్రపఠితములు నయిన న్యాసములే యిట ప్రసక్తములు. తంత్రగ్రంథపఠితము లయిన శ్రుతివిరుద్ధన్యాసములు అనాదర ణీయము లని అభియుక్తవచనము వలన తెలియుచున్నది.

> "యన్నాభ్యా అధ స్తదమేధ్య' మితి నాభ్యధోభాగ న్యాసస్పృశ్యత్వశ్రవణా చ్ఛ్రౌతస్య ప్రాధాన్యా త్తదేహా దరణీయమ్ ॥"

అని యనుటచేత నాభికి అధోభాగమున ఉన్న యవయవములు అస్పృశ్యములు. కావున, నిషిద్ధావయవన్యాసము లనాదర ణీయము లని గ్రహింపవలయును.

ఏతాదృశవివేకముతో తంత్రశాస్త్రగ్రంథానుసారము ఈ దక్షిణామూర్తికల్పము సంగ్రథిత మొనర్చబడినది. ఇందు శ్రీదక్షిణామూర్తి జపానుష్ఠానక్రమము, పూర్వాంగోత్తరాంగ మంత్రసహితముగ శ్రీ దక్షిణామూర్తి మహామంత్రము, ఉపాసకజన పారాయణోపయుక్తముగ, శ్రీ దక్షిణామూ ర్త్యుపనిషత్, హృదయకవచములు, అష్టోత్తరశత, సహస్రనామ స్తోత్రములు పొందుపరచబడినవి. శ్రీ దక్షిణామూర్తి కల్పము

నకు అంగభూతములుగ శ్రీ వనదుర్గామహావిద్యా పంచశతి, శ్రీ ప్రత్యంగిరా ఋక్పారాయణక్రమము, శ్రీకల్పము ఈ గ్రంథములో చేర్చబడినవి. శ్రీకల్పము ఇంతకు పూర్వము గ్రంథరూపమున వెలువడి యుండలేదు. ఇందు శ్రీసూక్త పంచదశర్చక్రమము, పూజాషోడశోపచారిక, శ్రీసూక్తతర్పణ, హోమక్రమము, పురుషసూక్త జపక్రమము, పురుషసూక్త షోడశోపచారపూజావిధానము, తర్పణహోమాదు లిందు చేర్చబడినవి. పారాయణోపయుక్తముగ శ్రీలక్ష్మీ సహస్రనామస్తోత్ర, శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామస్తోత్రము లీ కల్పమున చేర్చబడినవి. శ్రీసూక్తపరిశిష్టములో మేరుతంత్రాది గ్రంథములనుండి శ్రీసూక్త, పురుషసూక్తవిధాన ప్రయోగక్రమము లుద్ధరింపబడినవి. విద్యారణ్యభాష్య సంవలితముగ శ్రీసూక్త మీయబడినది. మహాలక్ష్మీరత్నకోశమునుండి శ్రీసూక్త సంపుట విద్యోద్ధారము గూడ ఉద్ధరించి పొందుబరచబడినది.

ఈ గ్రంథము, శ్రీ మహాగణపతికల్పము వలె శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారిచ్చిన ఆర్థికసహాయముతో వెలుగులోనికి వచ్చుచున్నది. ఉదారముగ ధనసహాయము నందజేసిన దేవస్థాన ప్రధానకార్యనిర్వాహణాధికారులు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాదు I. A. S. గారికి హార్దికకృతజ్ఞత లందజేయుచున్నాను.

. ఈ గ్రంథమును వెలుగులోనికి తెచ్చుటలో నాకు చేదోడుగా ఉండి సహకార మొసగిన సాధన గ్రంథ మండలి వ్యవస్థాపకులు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారికి శ్రీ దక్షిణామూర్తి అనుగ్రహము లభించుగాక యని యాశీర్వదించుచున్నాను.

ఈ గ్రంథమును ఇంత సుందరముగా ముద్రించిన విజయ ఆర్టు ప్రెస్ అధిపతులు శ్రీ తాతిరెడ్డి కోటిరెడ్డి గారికి ఆ దేవదేవుని యనుగ్రహము లభించుగాత.

దక్షిణాస్యవిధానేన సుప్రీతో యతిశేఖరః ।
పుమర్థాంశ్చతురో దేయాన్మహాకల్యాణదేశికః ॥

ఇతి శమ్

# విషయానుక్రమణిక

## శ్రీ దక్షిణామూర్తికల్పః

## శ్రీ వనదుర్గాపంచశతీక్రమః



## శ్రీ ప్రత్యంగిరాఋక్పారాయణక్రమః

శ్రీకల్పః

## శ్రీకల్పపరిశిష్టమ్



రచయిత

శ్రీ పోతుకూచి శ్రీరామమూర్తి

(శ్రీ విరజానందనాథ)



శ్రీ శివచక్రరాజః

యస్యాస్త్రి ప్రతిసంధి మర్మసహితం మధ్యే సబిందుం క్రమాత్
ధామాష్టార్యమ భూపవింశతి జినాః కోణాన్యథాష్టౌ నృపాః
షట్త్రింశత్త్రిశరా దళాని పరితో వృత్తం త్రిభూగేహకం
శ్రీ చక్రం పరికీర్తితం శివమయం సంసార సంహారకమ్ ||



శ్రీచక్రరాజః

బిందు త్రికోణవసుకోణదశారయుగ్మ ... 



శ్రీ దక్షిణామూర్తి పూజా యంత్రోద్ధారః

ఆదౌబిందుం సమాలిఖ్య షట్కోణంచ తతో లిఖేత్ ।
తత్పశ్చాద్వృత్తమాలిఖ్య వసుపత్రం తతః క్రమాత్ ॥
తద్బాహ్యే చాష్టపత్రంచ తతో వృత్తత్రయం లిఖేత్ ।
భూగృహత్రయసంయుక్తం మూర్తేర్యంత్రం సమాలిఖేత్ ॥

శ్రీః

# శ్రీ దక్షిణామూర్తి కల్పః

వటమూలే సమాసీనం రత్న సింహాసనే శుభే ।
రజతాద్రిప్రతీకాశం మునిదేవగణైః స్తుతమ్ ॥

జటామకుటినం దేవం ముద్రావ్యాఖ్యాన మణ్డితం ।
త్రినేత్రం సుప్రసన్నాస్యం దక్షిణాస్య మహం భజే ॥
ఏకో నిత్య శ్శివో వ్యాపీ దక్షిణామూర్తిరూపధృత్ ।
దక్షిణామూర్తి మన్త్రోఽయం సర్వసిద్ధిప్రదాయకః ॥
యో మన్త్రం దక్షిణామూర్తే స్సర్వదా సముపాశ్రయేత్ ।
స చ పాపవినిర్ముక్తః సర్వవిద్యాధిపో భవేత్ ॥
శ్రీకళ్యాణాభిధం దేవం భారతీయతిశేఖరం ।
ఆచార్యం దక్షిణాచారప్రవర్తక మహం భజే ॥

విరజానందనాథేన పూర్వతన్త్రానుసారతః ।
శ్రీగురోర్దక్షిణామూర్తేః షడఙ్గః కల్ప ఉచ్యతే ॥

భైరవప్రార్థనాంతం చ సంస్కుర్యా దాసనం తతః ।
ప్రాణాయామత్రయం కృత్వా జపం సఙ్కల్పయే ద్బుధః ॥

భూతశుద్ధిం తతః కృత్వా ప్రాణస్థాపన మాచరేత్ ।
మాతృకాన్యాస మారభ్య కళాన్యాసాంత మాచరేత్ ।
దిగ్బంధం చ తతః కృత్వా హృది దేవం విచిన్తయేత్ ॥

హృదయం ప్రజపే దాదౌ మన్త్ర మఙ్గయుతం జపేత్ ।
గురు ర్గణపతి ర్దుర్గా క్షేత్రపాల స్సరస్వతీ ।
ఏతాః శ్రీదక్షిణామూర్తేః పూర్వమంత్రాధిదేవతాః ॥

బాలా షడక్షరీదేవ్యాః స్వర్ణాకర్షణభైరవః ।
మృతసఞ్జీవనీ చైవ మహామృత్యుఞ్జయ స్తతః ॥

ఏతే పఞ్చమహామన్త్రా ఉత్తరాంగా మహేశితుః ।
మన్త్రషోడశసంయుక్తం మాలామన్త్ర స్తవం తతః ॥

తతో వర్ణావలీస్తోత్రం సంజపే త్కమలాలయే ।
జగన్మోహనకం నామ కవచం మన్త్రవిగ్రహమ్ ॥

ప్రజపేచ్చ తతో దేవి నామ్నా మష్టోత్తరం శతం ।
తతో నామసహస్రం తు ప్రజపే త్కమలాలయే ॥

షడఙ్గసహితో మన్త్ర స్సర్వసిద్ధి ప్రదాయకః ।
నియమేనైవ జప్తవ్యో నియమ స్సర్వకామధుక్ ॥

ప్రవక్ష్యామి సురారాధ్యే మంత్రాశ్చాంగాని వై శ్రుణు ।
మన్త్రాణాం హృదయం దేవి ముఖ మిత్యుచ్యతే బుధైః ॥

మాలామన్త్ర స్తవ శ్చాస్య చక్షుషీ కమలాలయే ।
వర్ణావళీ స్తవ శ్చాస్య శ్రోత్రం చేతి ప్రచక్షతే ॥

హస్తద్వయ మితి ప్రోక్తం నామ్నా మష్టోత్తరం శతం ।
నాసికేతి సురారాధ్యే మంత్రజ్ఞైః పరికీర్తితా ॥

నామ్నాం సాహస్రకం దేవి పాదద్వంద్వ మితీరితం ।
మన్త్రమూర్తేః షడఙ్గాని క్రమా దేతాని సుందరి ॥
అంగహీనస్తు యో మన్త్రః సర్వసంపద్వినాశకః ।
ఏతైః షడంగై స్సమేతా మన్త్రా స్సర్వార్థసాధకాః ॥
తారో నమో భగవతే దక్షిణామూర్తయే వదేత్ ।
మహ్యం మేధాం వదే త్ప్రజ్ఞాం ప్రయచ్ఛానలవల్లభామ్ ॥
అయం తు దక్షిణామూర్తే శ్చతుర్వింశాక్షరో మనుః ।
అవతీర్ణో దక్షిణాస్య స్సచ్చిదానందవిగ్రహః ॥
చతుర్థాశ్రమనిష్ఠశ్చ రుద్రాక్షై స్సమలంకృతః ।
సర్వదేవమయః ప్రభు ర్దక్షిణామూర్తివిగ్రహః ॥
యదస్తి యద్భాతి తదాత్మరూపం
నాన్య త్తతో భాతి నచాన్య దస్తి ।
స్వభావసంవి త్ప్రవిభాతి కేవలా
గ్రాహ్యం గృహీతేతి మృషైవ కేవలా ॥

## అథ మన్త్రోద్ధారః

జైమిని రువాచ :

మార్కండేయ మహాయోగిన్ శైవమన్త్రోత్తమోత్తమం ।
మనుం శ్రీదక్షిణామూర్తే ర్వదస్వ మునిపుంగవ ।

మార్కండేయ ఉవాచ :

వదామి దక్షిణామూర్తే ర్మన్త్రం సర్వార్థసాధకం ।
యస్య శ్రవణమాత్రేణ విద్యాసిద్ధిః ప్రజాయతే ॥

అయం పూర్వం చ కస్యాపి మయానోక్తో మహాత్మమః ।
స్నేహా ద్వదామి తం మన్త్రం తుభ్యం భక్తిమతాంవర ॥

ప్రణవం పూర్వ ముచ్చార్య ధాంత్యం వర్ణ మథోచ్చరేత్ ।
ఓకారేణ సమోపేతం మకారం తత ఉచ్చరేత్ ॥

భవాయాద్యం సముద్ధృత్య ఘాద్యం వర్ణ మథోచ్చరేత్ ।
అంతస్థాంత్యం సముచ్చార్య ఖాద్య మేకార సంయుతం ॥

దత్తాద్య ముచ్చరే త్షం చ తృతీయ స్వర సంయుతం ।
ణాకారదీర్ఘసంయుక్తం మం షట్స్వర సమన్వితం ॥

రకారయుక్తం తం వర్ణం య మేకార సమన్వితం ।
మకార ముద్ధరే త్పశ్చా ద్యయుక్తం హ మథోద్ధరేత్ ॥

ఏకారయుక్తం మం వర్ణం దీర్ఘబిందుక ధం తతః ।
పకారం రేఫసంయుక్తం జ్ఞకారం దీర్ఘబిన్దుకం ॥

రేఫయుక్తం పకారం చ యకారం తత ఉద్ధరేత్ ।
ఛకార ముద్ధరే త్పశ్చా ద్వహ్నిజాయా మథోద్ధరేత్ ॥

ఋషి బ్రహ్మోఽస్య మన్త్రస్య గాయత్రీ ఛంద ఈరితమ్ ॥
దేవతా దక్షిణామూర్తిః పరమాత్మా సదాశివః ॥

ప్రణవో బీజ మిత్యుక్తం స్వాహాశక్తి స్తథేరితా ।
నమః కీలక మిత్యుక్తం సర్వసిద్ధిప్రదాయకం ॥

కుర్యా ద్దీర్ఘస్వరై ర్న్యాసం ఆద్యంతోంకార సంయుతైః ।
ఋషి మూర్ధ్ని ముఖే ఛందో దేవతా హృది సంస్థితా ॥

బీజం శక్తిం న్యసే ద్దక్షవామయో స్తనయో రపి ।
కీలం మధ్యేఽవినాభావ్య స్స్వవాంఛా వినియోగవాన్ ॥

శిరో లలాటనేత్రేషు శ్రోత్రయోః గణ్డయో ర్ముఖే ।
దంతయో రోష్ఠయోః కంఠే బాహ్వో ర్నాభౌ చ గుహ్యకే ॥

కట్యో రూర్వోః పదద్వంద్వే న్యసే న్మన్త్రాక్షరా న్బుధః ।
ధ్యాయే త్తతో మహాదేవం దక్షిణామూర్తి రీశ్వరం ॥

శుద్ధస్ఫటిక సంకాశం జటామండల సంయుతం ।
అక్షమాలాం త్రిశూలం చ దధతం జ్ఞానముద్రికాం ॥

అభయం దధతం హస్తై ర్బిభ్రాణం పుస్తకం శివం ।
విద్యాం హస్తేన బిభ్రాణం సుధాకలశ ముత్తరం ॥
ముక్తాహార సమోపేతం చంద్రశీర్షం మహేశ్వరం ।
నమామి దక్షిణామూర్తిం భక్తానాం చింతితప్రదం ॥
ఏవం ధ్యాయే న్మహాదేవం దక్షిణామూర్తి మీశ్వరం ।
అష్టోత్తరశతం నిత్యం త్రిశతం వా జపేన్మనుం ॥
గద్యపద్యమయీం వాణీం షణ్మాసా ల్లభతే నరః ।
ఇతి ధ్యానాదికం సర్వముక్తం పాపహరం శుభం ।
ఇతః పరం కి మిచ్ఛా తే శ్రోతుం మే వద యోగిరాట్ ॥

ఇతి శ్రీ మార్కండేయ విరచితే శ్రీ దక్షిణామూర్తి
మన్త్రోద్ధారః

## శ్రీ దక్షిణామూర్తి మన్త్రార్థః

ఓంకారేణ :

స్థూల సూక్ష్మ కారణ ప్రపంచావధిభూతం ప్రత్యగభిన్నం తత్త్వమస్యాది మహావాక్యార్థభూతం బ్రహ్మాఽభిధీయతే । భగవచ్ఛబ్దేన-

"ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిం ।
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥"

శ్లోకోక్త సర్వజ్ఞ స్సర్వశక్తిమాం శ్చాభిధీయతే, దక్షిణాశబ్దేన-

సమర్థా సృష్టి స్థితి సంహారేషు మూర్తి ర్యస్య సః సత్త్వప్రధానమాయోపాధికో బిమ్బభూతః పరమాత్మాఽభిధీయతే । చతుర్థ్యంతేనైక్యం దృఢీక్రియతే । యో జీవః కర్తృత్వాది విశిష్టాంతఃకరణ ప్రతిబిమ్బభూతః ప్రతిపాద్యతే । నేతి నిషేధార్థః । తథా చాహం జీవో న కింతు భగవాన్ దక్షిణామూర్తి రేవ । ఏతా దృశాయ మహ్యా ముపాధినా తిరస్కృతాయ మహిమ్నే । మేధాం స్థిరా మసంభావనాది దోషరహితాం సవాసనా విద్యాద్వయ నివర్తికాం ప్రజ్ఞా మఖండ సాక్షాత్కారరూపాం । ప్రయచ్ఛ దేహి । తయా భ్రాంత్యాది నివృత్తిః । తామపి స్వాహా ఆత్మని సచ్చిదానంద స్వరూపే ప్రవిలాపయామీతి స్వాహాకారార్థః । యో జీవో న భవామి । కింతు కేవలో నిష్ప్రపంచశ్శివ ఇత్యుక్త శ్శివ

ఏవాహం। చతుర్థీ చైతన్యదృష్టీకారార్థా। జడానృతాహం కారేభ్యః ప్రాతిలోమ్యేన సత్యజ్ఞానానందాత్మకతయా అంచతి ప్రకాశయతీతి ప్రత్యక్ ।

ఇతి శ్రీ మచ్ఛంకరాచార్యకృతవ్యాఖ్యాసమాప్తా.

## శ్రీ దక్షిణామూర్తి పూజాయన్త్రోద్ధారః

అథాత స్సంప్రవక్ష్యామి దక్షిణామూర్తియన్త్రకం ।
ఆదౌ బిందుం సమాలిఖ్య షట్కోణం చ తతో లిఖేత్ ॥

తత్పశ్చాద్వృత్త మాలిఖ్య వసుపత్రం తతః క్రమాత్ ।
తద్బాహ్యే చాష్టపత్రం చ తతో వృత్తత్రయం లిఖేత్ ॥

భూగృహత్రయసంయుక్తం మూర్తేర్యన్త్రం సమాలిఖేత్ ।
షట్కోణే చ షడంగాని పత్రేష్వష్టసు పూజయేత్ ॥

సరస్వతీం వాచయన్తీం పుస్తకం సస్మితాననాం ।
బ్రహ్మాణం సనకం పశ్చాత్సనందన మతఃపరమ్ ॥

సనత్కుమారనామానం శుకం వ్యాసం గణేశ్వరం ।

తద్బాహ్యే చాష్టపత్రేషు పార్వతీం సుభగాం యజేత్ ॥

భద్రాం క్రియాం శాంతికాద్యాం కాళీం కలవికామపి ।
లోకేశాన్ భూపురే యజేద్వజ్రాద్యాయుధ సంయుతాన్ ॥

సిద్ధ గంధర్వ యోగీంద్ర విద్యాధరగణాన్ బహిః ।
పంచాక్షరోదితే పీఠే దక్షిణాస్యం ప్రపూజయేత్ ॥

## స్థాపనాయంత్రే బీజలేఖనమ్

అథాతో దక్షిణామూర్తే స్థాపనాయంత్ర ముచ్యతే ।
పూర్వవ ద్యంత్ర మాలిఖ్య మంత్రబీజాని సంలిఖేత్ ॥

షట్కోణేషు షడంగాని దేవాగ్రాదిప్రదక్షిణం ।
తారో నమో భగవతే దక్షిణామూర్తయే వదేత్ ॥

మహ్యాం మేధాం వదే త్ప్రజ్ఞాం ప్రయ చ్ఛానలవల్లభాం ।
సప్తార్ణం విన్యసే ద్బిందా శేషార్ణా నష్టపత్రకే ॥
స్వరాన్ షోడశ తత్రైవ ద్వంద్వశః పత్రసంస్థితాన్ ।
న్యసే ద్వర్గాష్టకం పశ్చా దష్టపత్రేషు భాగశః ॥
విన్యసే ద్వృత్తమధ్యే తు క్రమోత్క్రమాం చ మాతృకాం।
యంత్రే సంచింత్య దేవేశం కైవల్యం లభతే నరః ॥

## యన్త్రోద్ధారలక్షణం

జైమిని రువాచ :

యంత్రం శ్రీదక్షిణామూర్తే స్సర్వవిద్యాప్రదాయకం ।
వద మే యోగినాంశ్రేష్ఠ మార్కండేయ మహామునే ॥

మార్కండేయ ఉవాచ :

వక్ష్యామి దక్షిణామూర్తే ర్యన్త్రం సర్వార్థదాయకం ।
యస్య శ్రవణమాత్రేణ కవి ర్భవతి మానవః ॥

షట్కోణం విలిఖే దాదౌ తతో వృత్తం లిఖే న్మనే ।
లిఖే ద్దళానాం దశకం లిఖే ద్వృత్తం పునర్మనే ॥

ప్రణవం విలిఖే న్మధ్యే సాధ్యాఖ్యం కర్మగర్భితం ।
షడక్షరీమన్త్రరాజం లిఖే త్కోణేషు షట్స్వథ ॥

దళై ర్వర్ణద్వయాలేఖ్యం వర్ణపంచక మంత్యకే ।
ఆదిక్షాంతాక్షరై ర్వృత్తం వేష్టయే న్మానవోత్తమః ॥

సంలిఖ్య తన్మహాయన్త్రం పూజయే త్పార్వతీపతిం ।
ధారయేద్వా మహాయన్త్ర మేత ద్విద్యాప్రదాయకమ్ ॥

మహాకవి ర్భవే న్మంత్రీ సర్వవిద్యాసునిష్ఠితః ।
సర్వచింతిత మాప్నోతి యంత్రధారణతో మునే॥

అమృతానందనాథోక్తం యన్త్రం వక్ష్యా మ్యతఃపరమ్ ।
షట్కోణం విలిఖే దాదౌ తతో వృత్తద్వయం లిఖేత్ ॥

వస్వష్టకం లిఖే త్పశ్చా ద్దళానాం దశకం లిఖేత్ ।
చతురశ్రం లిఖే త్పశ్చా న్మధ్యే ప్రణవ మాలిఖేత్ ॥

కోణేషు విలిఖే ద్వర్ణాం శ్చతురోఽంత్యే లిఖే త్త్రియమ్ ।
అనుష్టుభేన మనునా వేష్టయే ద్వృత్త మాదితః ॥

ద్వితీయం వేష్టయే ద్రుద్రగాయత్రీమనునా మునే ।
దళేషు విలిఖే న్మంత్రం ప్రాసాదం మునిపుంగవ ॥

చతురశ్ర మఘోరాఖ్యమంత్రేణైవ చ వేష్టయేత్ ।
ఏతద్యన్త్రం సమాలిఖ్య ప్రాణస్థాపన మాచరేత్ ॥

పూజయే ద్ధారయే ద్వాపి గుళికీకృత్య యత్నతః ।
మహాకవి ర్భవే న్మన్త్రీ బృహస్పతిసమో నరః ॥

2)

అచలాం శ్రియ మాప్నోతి సర్వదా విజయం లభేత్ ।
కామసౌందర్య మాప్నోతి తేజస్వీ సూర్యవ ద్భవేత్ ॥
బేతాళగ్రహభూతాద్యా యక్షరాక్షసకిన్నరాః ।
యన్త్రధారణమాత్రేణ పలాయం యాన్తి దూరతః ॥
రాజానో దాసతాం యాంతి శత్రవో యాన్తి మిత్రతాం।
దాసీత్వ మాప్నుయు ర్నార్య స్త్వష్టైశ్వర్యా
ణ్యవాప్నుయాత్ ॥
ఏత ద్యన్త్రద్వయం యస్తు శుచితో ధారయే న్నరః ।
మూకో౽పి సాక్షా ద్వాణీశసదృశో నాత్ర సంశయః ॥
దేవేంద్రసదృశో భోగైః కుబేరసదృశ శ్శ్రియా ।
కామేన సదృశః కాంత్యా విజయా రామవద్భవేత్ ॥
సర్వా న్కామా నవాప్నోతి పురుషో నాత్ర సంశయః ।
ఇతి యన్త్రం తవ ప్రోక్తం భక్తానాం చింతితప్రదం ॥
కిమిచ్ఛసి మహాయోగిన్ పున ర్యోగీశ్వరప్రభో ॥
ఇతి శ్రీ మార్కండేయ విరచితే యన్త్రోద్ధార లక్షణం
నామ తృతీయ పరిస్పందః

## మంత్ర మాహాత్మ్యమ్

శ్రీ జైమిని రువాచ ॥

భగవన్ యోగినాం శ్రేష్ఠ సర్వశాస్త్రవిశారద ।
ఉక్తాః పూర్వం త్వయా శక్తిమంత్రాః కోటిగుణాధికాః ॥

ఇదానీం శ్రోతు మిచ్ఛామి శివమంత్రా ననుక్రమాత్ ।
తత్రాపి దక్షిణామూర్తేః శ్రోతు మిచ్ఛా మ్యనుత్తమం ॥
వద మహ్యం మహాభాగ మనుం శైవ మనూత్తమం ॥

శ్రీ మార్కండేయ ఉవాచ ॥

ఏకో నిత్య శ్శివో వ్యాపీ దక్షిణామూర్తిరూపధృత్ ।
స ఏవ సర్వజగతాం కర్తా హర్తా చ పాలకః ॥

సత్య మంత్రస్య మాహాత్మ్యం వర్ణితుం కేన శక్యతే ।
దక్షిణామూర్తి మంత్రోఽయం సర్వసిద్ధిప్రదాయకః ॥

వాక్సిద్ధిదోఽయం భక్తానాం సర్వైశ్వర్యప్రదాయకః ।
బృహస్పతిః పురా జప్త్వా మంత్ర మేన మభీష్టదమ్ ॥

ప్రాప్తవాం త్సకలా విద్యా స్సర్వైశ్వర్య మనుత్తమం ।
దక్షిణామూర్తిమంత్రస్య మాహాత్మ్యం పాపనాశనమ్ ॥

న శక్యతే మయా వక్తుం కల్పకోటిశతై రపి ।
దక్షిణామూర్తి మాహాత్మ్యం యస్య గేహే ప్రతిష్ఠితమ్॥

తత్ర విద్యా మహాలక్ష్మీ శ్చంచలాఽపి స్థిరా భవేత్ ।
అశ్రుతానాం చ శాస్త్రాణాం వ్యాఖ్యాతా మానవో
భవేత్ ॥

మంత్రస్యైతస్య మాహాత్మ్యం పఠే ద్యశ్చ శృణోతి వా ।
స పాపై ర్ముచ్యతే శీఘ్రం కల్పకోటిశతోద్భవైః ॥

ఓజ స్తేజో బలం శౌర్యం వీర్య మైశ్వర్య మక్షయం ।
మంత్రం జప్త్వా లభే న్మర్త్యః పరాం కాంతిం
సమాప్నుయాత్ ॥

స ఏవశుద్ధో ముక్త శ్చ పూతో వాక్సిద్ధిమా న్నరః ।
జ్ఞానీ స పుణ్యవాం శ్లోక్య స్సర్వవిద్యాసునిష్ఠితః ॥

శాస్త్రపారంగతో ధీమాం త్స సర్వాభీష్టదాయకః ।
సర్వా న్మనూ న్విజానాతి దక్షిణామూర్తిమంత్రవిత్ ॥

లభే ద్భుక్తిం చ ముక్తిం చ దక్షిణామూర్తిమంత్రవిత్ ।
చింతామణి రయం మన్త్రో భక్తానాం కల్పభూరుహః ॥

కామధేను రయం నృణాం శివమన్త్రోత్తమోత్తమః ।
సప్తకోటి మహామంత్రమధ్యేఽయం మను రుత్తమః ॥

యో మన్త్రం దక్షిణామూర్తే స్సర్వదా సముపాశ్రయేత్ ।
స పాపముక్తః శుద్ధాత్మా సర్వవిద్యాధిపో నరః ॥
జ్ఞానీ భూత్వా లభే న్ముక్తిం దుర్లభాం మానవైః పరైః ॥

ఇతి తే కథితం మన్త్రమాహాత్మ్యం కించి దుత్తమం ।
సమాసేన మహాయోగిన్ కిం పున శ్శ్రోతు మిచ్ఛసి ॥

ఇతి శ్రీ మార్కండేయ విరచితే కాండశతకే షష్ఠాంశకాండే శ్రీ దక్షిణామూర్తి ప్రశంసాయాం మన్త్రమాహాత్మ్యంనామ ప్రథమః పరిస్పందః

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసమ్ప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః ॥

ఓం సర్వచైతన్యరూపాం తా
మాద్యాం విద్యాం చ ధీమహి ।
బుద్ధిం యా నః ప్రచోదయాత్ ॥

నమో గురుభ్యో గురుపాదుకేభ్యో ।
నమః పరేభ్యః పరపాదుకాభ్యః ।
ఆచార్య సిద్ధేశ్వర పాదుకాభ్యో ।
నమోఽస్తు దేవీమణిపాదుకాభ్యః ॥

శ్రీవిద్యాపరిపూర్ణ మేరుశిఖరే బిన్దుత్రికోణస్థితే
వాక్క్షేశీ మహేశ బీజచరణే మంచే శివాకారకే ।
కామేశీం కరుణారసార్ణవమయీం కామేశ్వరాంకస్థితాం
కాఞ్చి చ్చిన్మయ చక్రరాజ నిలయాం
శ్రీబ్రహ్మవిద్యాం భజే ॥

ఓం నమః శ్రీవిద్యాపాదుకాభ్యః

## అథ మన్త్ర ప్రయోగక్రమః

శ్రీమాన్ దీక్షిత శ్శుచిః కృత నిత్యక్రియో జప మందిరం ప్రవిశ్య । చతుర్భి ర్వీక్షణాఽదిభి రాసనస్థానం సంస్కృత్య । కూర్మచక్రం విలిఖ్య । తత్రాధారశక్తి మారభ్య పేద్యంతాః పీఠదేవతా స్సంపూజ్య । తదుపరి కుశ, కృష్ణాజిన,

చిత్రకమ్బళ, వస్త్రాణి యథాక్రమ మస్తీర్య సంప్రోక్ష్య । ఆస్తీర్య । ఓం ఆధారశక్తి కమలాసనాయనమః । ఇత్యాసనే ఋజుకాయః ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా ఉపవిశ్య । పృథ్వీత్వ యేతి భూమిం సంప్రార్థ్య । ఆసనస్య వహ్న్యాదికోణేషు గణేశా దీన్ సమ్పూజ్య । ఓం ఊర్ధ్వకేశివిమణిధారిణీతి ద్వాభ్యాం శిఖాం బధ్నీయాత్ ।

అథ త్రిఖండాముద్రాం బధ్వా । అఖండమణ్డలాకార మిత్యాదినా సదాశివమణ్డలం విభావ్య । ద్వారశ్రీ స్సర్వదా పాత్విత్యాదినా కారికాష్టకం పఠిత్వా । గురుం గణపతిం దిక్పాలాంశ్చ నత్వా । దేవి త్వత్ప్రకృతం చిత్తం, సూర్య స్సోమో యమః కాలో ఇతి పాపశమనార్థం పఠిత్వా । అతి తీక్ష్ణమహాకాయేతి భైరవానుజ్ఞాం గృహ్ణీయాత్ ॥

తత్త్వైరాచమ్య। మూలేన ప్రాణానాయమ్య। దేశకాలౌ సంకీర్త్య । నామగోత్రాది స్మరణం కృత్వా । మమ సకుటుం బస్య క్షేమస్థైర్య విజయాభయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి ద్వారా ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుషార్థ ఫలసిద్ధ్యర్థం శ్రీ దక్షిణామూర్తిపరదేవతా ముద్దిశ్య, శ్రీ దక్షిణామూర్తి పరదేవతా ప్రీత్యర్థం, శ్రీ దక్షిణామూర్తిహృదయ, సాంగో పాంగ మూలమన్త్రజప, షోడశమాలామంత్రపఠన, త్రైలోక్య మోహన కవచపాఠ, అష్టోత్తరశతనామ, సహస్రనామ పారా యణసహిత శ్రీ దక్షిణామూర్తి మహామంత్రజపం కరిష్యే ॥ ఇతి సంకల్ప్య ॥

శిరసి గురుత్రయం స్మృత్వా । కృతాఞ్జలి ర్వామ దక్షిణ పార్శ్వయో ర్గురుం గణపతిం పురతః స్వేష్టదేవతాం చ నత్వా । అపక్రామం త్వపసర్పం త్వితి ద్వాభ్యాం నారాచ ముద్రయా భూతా నపసార్య । ప్రత్యేక మన్త్రమన్త్రం స్మర న్వామపార్ష్ణిఘాతత్రయేణ భౌమాన్, తాళత్రయే ణాన్తరిక్ష గాన్, తిర్యగ్దృష్ట్యవలోకనేన దివ్యాంశ్చ త్రివిధా న్విఘ్నా నపసార్య । సుదర్శనేన దిగ్బంధనం కృత్వా । వహ్నిప్రాకార ముద్రయా అగ్నిప్రాకారత్రయం విభావ్య । శూలేనాత్మానం రక్షేత్ ॥

అథ ప్రాణానాయమ్య । భూతశుద్ధి స్వప్రాణప్రతిష్ఠాపనే కృత్వా । మాతృకాప్రాణాయామత్రయం కృత్వా । మాతృ కయా వ్యాపకం విన్యస్య । అంతర్మాతృకా బహిర్మాతృకా శ్రీకంఠాది కళాన్యాసా న్న్యాసమందారోక్తప్రకారేణ విన్యస్య। శాంతి పఠనపూర్వకం శ్రీ దక్షిణామూర్తిహృదయం పఠేత్ ॥

## శ్రీ దక్షిణామూర్తిహృదయమ్

అస్య శ్రీ మేధాదక్షిణామూర్తిహృదయస్తోత్ర మహా మన్త్రస్య। బ్రహ్మ ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ దక్షిణా మూర్తి ర్దేవతా । శ్రీదక్షిణామూర్తిప్రీత్యర్థే జపే విని యోగః ॥ ఆ మిత్యాది కరహృదయాదిన్యాసః ॥ భూర్భువ స్సువరో మితి దిగ్బంధః ॥

ధ్యానమ్ ॥

భస్మవ్యాపాండురాంగ శ్శశికలధరో జ్ఞానముద్రాక్షమాలా
వీణాపుస్తై ర్విరాజ త్కరకమలధరో యోగపట్టాభిరామః ।
వ్యాఖ్యాపీఠే నిషణ్ణో మునివరనికరై స్సేవ్యమానః ప్రసన్నః
సవ్యాళః కృత్తివాసా స్సతత మవతు నో
దక్షిణామూర్తిరీశః ॥

లమితి పంచపూజా । సహనావవత్వితి శాంతిః ॥

నారదముని ర్బ్రహ్మాణం ప్రత్యాహ । మత్తాత లోకేశ నమస్కరోమి । ధాతారం త్వా శిరసా । మనసా వేత్సి శ్రీ దక్షిణామూర్తిహృదయంశ్రోతు మిచ్ఛామి త్వన్ముఖామ్బుజాత్ । సత్కృపయా వద బ్రహ్మన్ । గురూపాసకస్య దేవో భాసకః। నాస్త్యన్యః సత్యః తస్మా ద్ధృదయం వదా మిత్యాహ ప్రజాపతిః । మునే ఇదం సంస్పృష్టం ఋగ్యజు స్సామాధర్వణో పనిషత్సూక్తం హృదయ మితి గాయంతే చతుష్షష్టి కళా విద్యాః । యద్ధృదయం తవ వక్తేతి ధ్యాత్వా । భక్త్యా శ్రద్ధయా గురు మాదిపూరుషం । గురు స్సంతుష్టో భవతి । హృదయం వక్తుం క్షమో భవతీతి । ధ్యానా ద్విరరామ । అసౌ హృదయ మిత్యాహ । ఆకాశశరీరం బ్రహ్మేతి జ్యోతి ర్జాయతే । అథ వాఽన్యాధ్యాత్మగోచరం భవతి । అథ పిండాకృతిః । దక్షిణాభిముఖో వటస్థితో లీలార్థం పురుషాకృతి ర్భజతే । స్వరూపాఖ్యో బోధయతి । అణోరణీయా నితి శ్రుత్యా గురుమూర్తిః స్మృతః। ప్రణవం ప్రథమమన్య ద్వేదాః

చత్వారో విద్యా శ్చతుష్షష్టిః జ్ఞానం।సత్యం తప శ్శమః। ధర్మో దమః। శ్రద్ధా భక్తిః। ప్రజ్ఞా మాయా ఇత్యాదయో బహవో జాయంతే। అపరిచ్ఛేద్యమయః। అవయవేషు కిం భవతి। అహం దక్షిణో విష్ణు స్సవ్యభాగః। మధ్యమ శ్శివః। త్రిమూర్తి స్సంపృక్తో దక్షిణామూర్తిః। అథ త్రిమూర్తయః।సాత్త్విక రాజస తామసాః। తస్యైవ కథం అహం రజః। సాత్త్వికో విష్ణుః। తామస శ్శివః। ఉమా శక్తిరూపం। కిం వినియోగః। అహం స్రష్టా। విష్ణుర్గోప్తా। శివో హంతా। బ్రహ్మ విష్ణు శివాత్మకో గురుః వేదాంతే చ ప్రతిష్ఠితః। రోమస్థా శ్శిరసో వేదాః ప్రవర్తన్తే మునయో గాత్రరోమజాః। ముఖా శ్చతుర్వేదా శ్చతుష్షష్టికళా స్సప్తకోటి మహామంత్రాః। ముఖా ద్బ్రాహ్మణో భవతి। బాహ్వో రాజన్యః। ఊర్వోర్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత। చన్ద్రమా మనసో జాతః। తథా లోకాగ్ం అకల్పయన్। అర్క వహ్ని ద్విజాధిప చక్షూం ష్యాస్యే వర్తంతే। గిరో వేదాః। రజసం అస మలినం। రేతో హిరణ్యం। పృష్ఠ భాగా చ్చక్రశిష్యా వర్తన్తే। జిహ్వాయాం కిన్నరాః। దంతాః పితరః। సాధ్యాః జటాః। యక్షాః ఆస్యే। స్వేదా ద్వీరభటాః। పదోః త్రిస్రోతా వర్తతో! శాస్య మహాళిమాలా।జంఘా ధ్ధరా। గావః పాదాంగుష్ఠాత్।కిమస్యాయుధం। మేరు ర్భవతి। శేషోఽస్య తల్పః। కటకోఽనంతః। యజ్ఞసూత్రం వాసుకిః। కటిసూత్రం తక్షకః। హారః కర్కటకో భవతి। పద్మకః కుణ్డలః। మహా

